# నీటిమరల గ్రామం

– యం.కె.గౌరవ్, పర్యవరణ కార్యకర్త

(ప్రపంచ ప్రసిద్ధ చలనచిత్రకారుడు అకిరా కురుసోనా 1990లో నిర్మించిన 17 నిమిషాల కలర్ సినిమాఇది. 'విలేజ్ ఆఫ్ వాటర్ మిల్స్' పేరుతో విడుదలయిన ఈ చిత్రం జపనీస్ అకాడమి అవార్డునుగెలుచు కోవడమేకాక 'గోల్డన్ గ్లోబ్' అవార్డుకి నామినేట్ అయింది. ఈ మధ్య టి. విజయేంద్ర రాసిన 'రిగేనింగ్ పరడైస్' (టువర్డ్స్ ఎ ఫాజిల్ ఫ్రీ సోసైటి) పుస్తకం చదివినపుడు ఆయన రాసిన అకిరా కురుసోవా చిత్ర ఎనిమిదవ భాగం 'స్వప్నాలు' చదివి నేను బాగా ప్రభావితమయ్యను. అందుకే దాన్నిక్కడ స్వేచ్ఛానువాదం చేస్తున్నాను.

ఒక నాగరిక యువకుడు బేగ్ తగిలించుకుని, బూట్లు వేసుకుని, నీలం రంగు బట్టలూ, అదే రంగు టోపీ పెట్టుకుని ఒక ప్రశాంతమయిన గ్రామంలోకి ప్రవేశిస్తాడు.నీటిమరలున్న ఆగ్రామం, రెండు పారే పెద్ద కాలువల మధ్య నిర్మించిన వంతెన, దాని చుట్టు పువ్వులతో ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. ఆ గ్రామంలో చాలా గుడిసెలుంటాయి. ప్రతి గుడిసెకి ఒక నీటిమర ఉంటుంది. అక్కడ గ్రామ స్వరూపం చూస్తుంటే యువకుడి మొహంలో ఆశ్చర్యం కనిపిస్తుంది. ఇంతలో కొంతమంది పిల్లలు అతనికి ఎదురవుతారు.

పిల్లలు అతనికి గుడ్‌మార్నింగ్ చెబితే అతను కూడా వారికి గుడ్‌మార్నింగ్ చెబుతాడు.

పిల్లలు కాలవదాటి వంతెన పక్కనున్న ఒక రాయిపై తమ చిన్న చిన్న చేతులతో పువ్వులు పెట్టి వెళ్ళిపోతారు.

యువకుడు అక్కడ మనోహరమయిన పరిసరాల్ని సంభ్రమంగా చూస్తూ ముందుకు నడుస్తుంటాడు. పక్షుల కిలకిలరావాలు విని ఆనందిస్తుంటాడు.అప్పడతనికి ఒక పూరిపాక కనిపిస్తుంది. అక్కడొక పండు ముసలాయన టోపీ పెట్టుకుని నీటిమరని మరమ్మత్తు చేసుకునే పనిలో ఉంటాడు. ఆ ముసలయన గడ్డమూ కనుబొమ్మలూ పూర్తిగా పండిపోయి ఉంటాయి.యువకుడు అక్కడకి చేరుకుంటాడు.

యువకుడు అతన్ని పలకరిస్తూ గుడ్‌మార్నింగ్ అంటే వృద్ధుడు కూడా గుడ్‌మార్నింగ్ అంటూ పలకరిస్తూ మటకలుపుతారు.

యువకుడు ఈ ఊరి పేరేంటి? అదే మీ గ్రామం పేరేంటి? అని అడుగుతాడు.

వృద్ధుడు ఒక పేరంటూ ప్రత్యకంగా లేదు. మేమైతే కేవలం 'ఊరు' అంటామంతే. కొందరు మాత్రం 'నీటిమరల గ్రామం' అంటుంటారు.

యువకుడు : గ్రామస్తులందరూ ఇక్కడే నివసిస్తుంటారా?

వృద్ధుడు : కొందరు వేరే ప్రాంతాల్లో ఉంటారు.

యువకుడు : ఇక్కడ కరెంట్ లేదే?

వృద్ధుడు : అవసరం లేదు. సాధారణంగా ప్రజలు అతిగా సౌకర్యాలకి అలవాటు పడ్డారు. అదే అభివృద్ధనుకుంటున్నారు. నిజంగా ఏవైతే యోగ్యమైనవో వాటిని చులకనగా చూస్తూ విడిచిపెడుతున్నారు.

యువకుడు :మరి దీపాల మాటేమిటి?

వృద్ధుడు : మేం నూనె, కొవ్వొత్తులూ వాడతాం.

యువకుడు : కాని, రాత్రయితే చాలా చీకటిగా ఉంటుంది కదా?

వృద్ధుడు : అవును. రాత్రనేది చీకటిగానే ఉండాలి. రాత్రి కూడా పగలంత ప్రకాశవంతంగా ఎందుకుండాలి? కాంతిగల రాత్రుళ్ళు నాకిష్టముండవు. అలా అయితే మనకు ఆకాశంలోని నక్షత్రాలు కనపడవు.

యువకుడు : మీకిక్కడ పొలాలున్నాయి కాని ట్రాక్టర్లులేవే?

వృద్ధుడు : అవసరం లేదు. మాకు ఎద్దులూ, గుర్రాలూ ఉన్నాయి.

యువకుడు : మరి, వంటచెఱకు కోసం ఏం చేస్తారు?

వృద్ధుడు : కట్టెల పైనే ఆధారపడతాం. అయితే, వాటంతట అవే పడిపోయిన చెట్లని తప్ప మిగిలినవాటిని నరకడం సరికాదని మేం భావించాం. అలాంటి చెట్ల కలపని మనం సరిగా వినియోగించుకుని బొగ్గు చేసుకోవాలేకాని, అడవంతట్నీ తగలెడితే వచ్చేంత వేడిని ఆ కొన్ని చెట్లే ఇవ్వగలవు. పశువుల పేడ మంచి వనరు.

మనిషన్నవాడు ఎలా ఉండాలో అలా జీవించడానికి మేం ప్రయత్నిస్తాం. అదే సహజమయిన జీవన మార్గం. ఈ రోజూ ప్రజలంతా తాము కూడా ప్రకృతిలో భాగమేననే సత్యాన్ని విస్మరించారు. ప్రకృతిని నాశనం చేసే జీవనవిధానంపై వారు ఆధారపడుతున్నారు. ముఖ్యంగా శాస్త్రవేత్తలు వారే, వాళ్ళేదో అభివృద్ధి చేస్తున్నామనే పెద్ద భ్రమల్లో ఉన్నారు. వాళ్ళు నిపుణులైతే అవ్వొచ్చుకాని, ప్రకృతి తత్వాన్ని అర్థం చేసుకున్నవాళ్ళు కారు. అంతిమంగా ప్రజల్ని బాధించేవాటినే వాళ్ళు అవిష్కరిస్తారు. అలాంటి అవాంఛనీయ సృజనల్ని చూసి గర్విస్తారు.

దౌర్భాగ్యమేంటంటే ఎక్కువ మంది ప్రజలు కూడ అలాగే ఆలోచిస్తున్నారు. తమని తము అద్భుతమైన అతీతశక్తులు కలవాళ్ళుగా వాళ్ళు భావించుకుంటారు. తమను తామే ఆరాధించుకుంటారు. అయితే, పర్యావరణాన్ని కోల్పోతున్నామనే నిజం వాళ్లకి తెలియదు. వినాశనం వైపునకు దూసుకెళుతున్నామనే విషయాన్ని వాళ్ళు గ్రహించలేరు. మానవాళి మనుగడకి ప్రధానమయినది ఏదైనా వుంటే, అవి స్వచ్ఛమయిన గాలీ, నిర్మలమయిన నీరూ, చెట్లూ చేమలూ మాత్రమే.

అవన్నీ మనవల్లనే మలినమయి, కలుషితం అవుతున్నాయి. కలుషిత గాలి, కలుషిత నీరు మనుషుల హృదయాలను కలుషితం చేస్తున్నాయి. చుట్టూ చూస్తూ యువకుడు దీర్ఘాలోచనలో పడతాడు.

యువకుడు : దార్లో నేనొస్తుంటే కొంతమంది పిల్లలు వంతెన పక్క ఒక రాయిపై పువ్వులు ఉంచడం చూసాను. ఎందుకు?

వృద్ధుడు : ఓ అదా ! చాలా కాలం కిందట ఒక యాత్రికుడైన పరదేశస్తుడు ఇక్కడ మరణించాడు. అతడి పార్థివ దేహాన్ని అక్కడ ఖననం చేశారు. ఆ విషయాన్ని జనం మరిచిపోయినా, ఆయన సమాధిపై పువ్వులు ఉంచడం మాత్రం మానలేదు.

యువకుడు : (దూరంగా వినిపిస్తున్న సంగీత వాయిద్యాల ధ్వనులు వింటూ) ఈ రోజు ఏదైనా ఉత్సవమా?

వృద్ధుడు : (చేతిని చెవి దగ్గర పెట్టుకు విని) కాదు. అంతిమ సంస్కారం. మీకు వింతగా ఎందా? ఒక మంచి ఆనందకరమయిన అంతిమ సంస్కారం. జీవితాంతం కష్టపడినందుకు కృతజ్ఞతలు పొందడం బాగుంటుంది. ఇక్కడ ఏ గుళ్ళూ, గోపురాలు, మందిరాలూ లేవు. ఏ మతగురువులూ, మతాధిపతులూ లేరు. ప్రజలందరూ చనిపోయిన వారిని కొండపైనున్న స్మశానం దగ్గరకు మేళతాళాలతో తీసుకెళతారు. యవ్వనస్తులూ, పిల్లలూ పోయినపుడు మాత్రం మేమిలా చేయడానికి ఇష్టపడం. అలాటి సందార్భాన్ని స్తుతించుకోవడం కష్టం. ఆ నష్టాన్ని భరించడం బాధాకరం.

ఇక్కడ ప్రజలు సహజంగా జీవిస్తారు కనుక పరిపూర్ణమయిన జీవితాన్ని ఆస్వాదించి పండు వయసులో మాత్రమే కన్నుమూస్తారు. ఈ రోజు పోయినామె వయసు 99 సంవత్సరాలు పైబడే ఉంటుంది. నువ్వు నన్ను క్షమించాలి; నేనా ఊరేగింపునకు వెళ్ళాలి. (వృద్ధుడు లేచి తన గడిసెలోకి వెళుతూ, వెనక్కి తిరిగి) నిజం చెప్పాలంటే, ఆమె నా ప్రథమ ప్రేయసి. అయితే, నా మనుసు విరిచేసి వేరొకరి కోసం నన్ను వదిలి వెళ్ళిపోయింది. (నవ్వుతాడు) హా..హా..హా.. వృద్ధుడు గుడిసెలోకి వెళ్ళి నారింజ రంగు కోటు, అదే రంగు బూట్లూ వేసుకుని కుడిచేత్తో గంటలు పట్టుకుని బయటకొస్తాడు.

యువకుడు : ఇంతకి, ఇప్పుడు మీకెన్ని సంవత్సరాలు?

వృద్ధుడు : నాకా? నూటమూడు. జీవితాన్ని చాలించడానికి చక్కని సరైన సమయంగల వయసు. కొంతమంది జీవితం కష్టమయినదంటారు. అవి ఒట్టి మాటలే. నిజానికి, జీవంతో, సారంతో బతకడమనేది ఎప్పుడూ బాగుంటుంది. జీవించడం ఆతృతనిస్తుంది. ఆత్మసంతృప్తిని ఇస్తుంది.

వృద్ధుడు కొన్ని పువ్వుల్ని తుంచి ఎడం చేత్తో పట్టుకుని ఉత్సవంలో పాల్గొనడానికి వెళతాడు. వాయిద్యకారులు, ప్రజలు నృత్యం చేస్తు వెళుతుంటారు. ముసాలయన ముందుండి సంగీతానికనుగుణంగా చేతులూపుతూ అడుగులేస్తుంటాడు. యువకుడు ఆ గుంపుని ఉల్లాసంగా చూస్తూ, శవపేటిక దాటే ముందు తన టోపీ తీసేసి నిలబడతాడు.

తర్వాత చిరునవ్వుతో వెనక్కి తిరిగి ప్రయణమవుతాడు. సెలయేటి గలగలా, పక్షుల కిలకిలలూ వాయిద్యంగా వినిపిస్తుంటే, నీటిమరలు నెమ్మదిగా తిరుగుతుంటాయి. యువకుడు ఆ ఊరి వంతెన దాటి వెళుతూ ఎందుకో ఒక్కసారిగా ఆగిపోయి వెనక్కి చూస్తాడు. వెంటనే వంతెన ఇవతలకు వడివడిగా తిరిగొచ్చి కొన్ని పువ్వుల్ని తుంచి, పిల్లలుంచినట్లుగానే అక్కడ అపరిచితుడి సమాధిపై ఉంచి వెళ్ళిపోతాడు.

శ్రావ్యమైన జలప్రవాహ రాగాలతో, మధురమైన పక్షుల గుసగుసలతో ఆ గ్రామీణ ప్రాంతం శాంతి యుతంగా ఉంటుంది. నీటిలోకి రాలిపడిన ఒక పండుటాకు ఆ నీటిలో తేలుతూ సాగిపోతుంటుంది.

దృశ్య మూలం : అకిరా కురుసోవా
ఆంగ్లంలో : టి. విజయేందర్
తెలుగు సేత : యం.కె. గౌరవ్